THE ANDHRA PATRIKA, MADRAS.



# ఆంధ్రపత్రిక



Regd. No. M, 1118 సంపుటం 38 సంచిక 170 FOUNDER DESODHARAKA K NAGESWARA RAO శుక్రవారం 21-9-1951 వెల 1 అణా హా॥ 0-1-2

# వినోబాభావే విజ్ఞప్తిపై స్వామిజీ ప్రాయోపవేశ విరమణ

## రాష్ట్రనిర్మాణానికి శాయశక్తులా నెహ్రూ కృషి: ఆచార్య వినోబాభావే హామీ

### దీక్షావిరమణకై అనుచరులకు ఆదేశం

[ ఆంధ్రపత్రిక ప్రత్యేక విలేఖరి ]

గుంటూరు సెప్టెంబరు 20: ఆచార్య వినోబాభావే గత రాత్రి చేసిన విజ్ఞప్తిని పురస్కరించుకొని స్వామీ సీతారాం, నేటి మధ్యాహ్నం 12-30 గంటలకు ఒక గ్లాసెడు నారింజరసం పుచ్చుకొని ప్రాయోపవేశ దీక్ష విరమించారు. గుంటూరు మహాయజ్ఞశాలలోనూ ఆంధ్రదేశమందంతటా వెలసిన ఉపయజ్ఞశాలలలోనూ, ఉపవాస వ్రతులందరూ వెంటనే తమ ఉపవాసాలను విరమించవలసిందిగా స్వామీజీ ఆదేశించారు. ప్రాయోపవేశం విరమించినట్లు స్వామీజీ భారతప్రధాని నెహ్రూకు తంతి పంపారు.

సుప్రసిద్ధ ఆంధ్ర సంస్కృత పండితులు అవధాని కాశీ కృష్ణాచార్యులుగారు గ్లాసులో అందించిన నారింజరసము స్వామీజీ పుచ్చుకొన్నారు. ఉపవాసవ్రతం విరమించిన మిగతా వారందరికీ స్వామిజీ గంగోదకం యిచ్చారు.

మధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యులుగారి వేదాధ్యయనంతో దీక్షావిరమణం క్రతువు ఆరంభమైంది. మౌల్వీ ఒకరు కొరాన్ భాగాలను చదివారు. ఆంధ్ర క్రైస్తవ కళాశాల ప్రిన్సిపాల్ డా॥ ఎస్. పాలస్‌గారు బైబిల్ భాగాలను చదివి వినిపించారు. స్వామిజీ 15 నిమిషాలపాటు భగవంతుని ప్రార్థించారు. తదనంతరం చెరుకుముక్కలు, పండ్లరసమూ ఆహారంగా స్వామిజీ స్వీకరించారు.

ప్రధాని పండిట్ నెహ్రూ ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకై శాయశక్తులా కృషి చేస్తున్నారని, తక్షణం ప్రాయోపవేశం విరమించడం చాలా మంచిదని ఆచార్య వినోబాభావే గతరాత్రి చిందా నుంచి టెలిఫోన్ ద్వారా స్వామి సీతారాంను అర్థించారు. తమ అభ్యర్థనను పాటిస్తూ ప్రాయోపవేశ దీక్షను విరమిస్తున్నానని స్వామీ సీతారాం గతరాత్రే వినోబాభావేకు తంతి పంపారు.

### స్వామిజీ ప్రకటన

రాత్రి 1 గంటకు మా విలేఖరి స్వామీజీని సందర్శించగా, వారిలా చెప్పారు:

"ప్రేమ పూర్వకంగా వినోబాజీ చేసిన విజ్ఞప్తిని పురస్కరించుకొని ఇదటి మహాయజ్ఞాన్ని, మిగతా చోట్ల ఉపయజ్ఞాలను చాలించాలని నిశ్చయించుకొన్నాను. ఉపవాస వ్రతం చేస్తూన్న వారంతా, ఉపవాసం విరమిస్తూ ఒక కప్పు పండ్లరసం త్రాగాలని విజ్ఞప్తి చేస్తున్నాను."

### వినోబాభావే విజ్ఞప్తి

ప్రాయోపవేశం విరమించవలసిందిగా స్వామీ సీతారాంకు గతరాత్రి వినోబాభావే యీ విజ్ఞప్తి చేశారు:

"దయచేసి వెంటనే ప్రాయోపవేశం విరమించండి. ప్రాయోపవేశం కొనసాగించటంవల్ల యేర్పడే పరిస్థితి మీ ఆశయానికి అడ్డుతగులు తున్నట్లు నాకు కన్పిస్తున్నది. కనుక యిప్పుడు ప్రాయోపవేశం విరమించినట్లయితే మీ ఆశయం నెరవేరే అవకాశం ఉంటుంది. ఆంధ్రరాష్ట్ర నిర్మాణం విషయమై ప్రధాని నెహ్రూ శాయశక్తులా కృషి చేస్తున్నారనే దృఢనమ్మకం నాకు కలిగింది."

ప్రాయోపవేశం విరమించినట్లు వెంటనే తమకు తెలియపర్చాలని కూడా వినోబాభావే సీతారాంగారిని కోరారు.

### స్వామీజీ సమాధానం

వినోబాభావే విజ్ఞప్తికి స్వామీ సీతారాం, గత అర్ధరాత్రివేళ తంతి ద్వారా యీ సమాధానం పంపారు:

"అనోన్యశ్యానురాగంచే గాఢంగా బంధింపబడిన ఆత్మీయులం మనం. మనలో యేఒకరు యెంతటి తీవ్ర అవేదనకు గురి అవుతారో, అంతటి తీవ్ర ఆవేదనను మిగతవారు గూడా అనుభవిస్తారు. ఈ ఆవేదనాభారంతో, ఇతర విషయాలేవీ దృష్టికి రావు. ఈ ఉద్యమం విషయంలో మీరు చూపిన శ్రద్ధవల్లా, మీరిచ్చిన యీ సలహావల్ల

(2-వ పేజీ చూడుడు)

### దీక్షాపరులస్థితి

[మా ప్రత్యేక విలేఖరి]

గుంటూరు సెప్టెంబరు 20: శ్రావణ శుద్ధ పౌర్ణమినాడు తిరుపతి వేంకటేశ్వర సాన్నిధ్యాన ప్రారంభించి, 38 రోజులుగా సాగించిన ప్రాయోపవేశ దీక్ష, నేటితో విరమించినప్పటికీ, స్వామీ సీతారాం ప్రభృతులు, పూర్తిగా కోలుకోవడానికి యింకా కొంతకాలం పడుతుంది.

స్వామీజీ పాదాలు బాగా ఉబ్బినవి. నేతి చలపతిగారు చాలా బలహీనస్థితిలో ఉన్నారు. ప్రాయోపవేశం విరమించమని, దుర్గాంబగారికి స్వామీజీ అనుజ్ఞ యిచ్చినప్పటికీ ఆమె గారింకా ఆహారం తీసుకొనే స్థితిలో లేదు. ఆమె యింకా ప్రమాదస్థితినుండి బయటపడలేదు. సంపత్కుమార్ ప్రాయోపవేశం చెయ్యాండడమే గాక రెండు రోజులుగా మౌనవ్రతం గూడా అవలంబించారు. మద్దులేటిగారు గూడా బలహీనంగా ఉన్నారు. రెండు రోజులవరకూ ఎక్కడికీ కదలగూడదని స్వామీజీకి, చలపతిరావుగారికి సంపత్కుమార్‌గారికి వైద్యులు చెప్పారు. దుర్గాంబగారు వెరయ్యచౌదరిగారి నర్సింగ్ హోంలో ఉన్నది. ఇంకా వారం రోజులు ఆమె అక్కడే ఉండవలసి ఉన్నది మద్దులేటి, బసవయ్యగారలను నర్సింగ్ హోంనుంచి పంపివేస్తారు. వీరిగాక మహాయజ్ఞశాలలో 30 మంది ఉపవాసం చేస్తున్నారు.

## రాష్ట్రసిద్ధికై ప్రాయోపవేశం పూనిన దీక్షాపరులు

శ్రీమతి దుగ్గిరాల దుర్గాంబగారు, దుగ్గిరాల బసవయ్యగారు, నేతి చలపతిగారు, ఆదుసుమల్లి మద్దులేటిగారు, ఆర్. కె. రామలింగారెడ్డిగారు, శ్రీ సంపత్కుమార్

## రాష్ట్రనిర్మాణం విషయమై త్వరలో అధికారప్రకటన

### అక్టోబరు 2 నాటికే రాష్ట్రం ఏర్పర్చాలని నెహ్రూకు స్వామీజీ తంతి

న్యూఢిల్లీ, సెప్టెంబరు 20: ఆంధ్రరాష్ట్ర నిర్మాణం విషయమై త్వరలోనే అధికారప్రకటన వెలువడగలదని నేడిక్కడ తెలియవచ్చినది. స్వామి సీతారాంగారు తమ ప్రాయోపవేశం విరమిస్తున్నట్లు ప్రధాని నెహ్రూకు తంతి పంపుతూ "అక్టోబర్ 2 నాటికే ఆంధ్రరాష్ట్రం యేర్పడగలదని ఆశిస్తున్నాను" అని ఆ తంతిలో సూచించారు.

ఆ యా పార్టీల సమ్మతి అందగానే, ఆంధ్రరాష్ట్ర సమస్యను పరిష్కరించివేయుటకు, భారత ప్రధాని పండిట్ నెహ్రూ, హోంశాఖా మంత్రి సి. రాజగోపాలాచారిగారలు, ఆతురపడుతున్నారని, యిటీవల కొద్దిరోజులుగా యీ ఉభయులను కలుసుకొని మాట్లాడిన ఆంధ్రనాయకులనేకమంది చెప్పారు.

జె. వి. పి. నివేదిక ప్రకారం ఆంధ్ర రాష్ట్రాన్ని యేర్పాటుచేయడం తమకు సమ్మతి లేదని, తమిళనాడు కాంగ్రెసు అధ్యక్షుడు కామరాజనాడారు గారు ప్రధాని నెహ్రూకు ఉత్తరం వ్రాశారట. ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి అంగీకారం తెలుపుతూ కర్నాటక కాంగ్రెసు అధ్యక్షుడు నిజలింగప్పగారు గూడా, నెహ్రూకు లేఖ వ్రాశారు. ఇటీవల ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సంఘము నెల్లూరులో సమావేశమై, విభజనసంఘ సిఫార్సులు ప్రాతిపదికగా వెంటనే ఆంధ్రరాష్ట్రం యేర్పాటు చేయాలని భారత ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానం చేసింది.

ఇహ తమిళనాడు, కర్నాటక రాష్ట్ర కాంగ్రెసు సంఘాలు, మదరాసు ప్రభుత్వము ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి అంగీకారం తెలుపుతూ, లాంఛనప్రాయంగా తీర్మానాలు చేసి పంపాలి. అలా చేసినట్లయితే కేంద్ర ప్రభుత్వం ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి పూనుకో వలసిందిగా కోరుతూ మద్రాసు ప్రభుత్వానికి, న్యాయశాస్త్రరీత్యా ఆదేశం పంపుతుంది.

డా॥ పట్టాభిసీతారామయ్య, కళా వెంకట్రావు, మొసలికంటి తిరుమలరావుగారలు, యివాళ ప్రధాన మంత్రి నెహ్రూను కలుసుకొన్నారు. వెంటనే ప్రాయోపవేశం విరమించవలసిందిగా స్వామి సీతారామ్‌కు తంతి ద్వారా విజ్ఞప్తిచేశారు. పండిట్ నెహ్రూ విజ్ఞప్తి చేసినప్పటికీ గూడా ప్రాయోపవేశం కొనసాగించడం బాధాకరంగా ఉన్నదని, త్వరలో ఆంధ్రరాష్ట్ర నిర్మాణ ప్రయత్నాన్ని భగ్నంచేయడానికి కొన్ని వర్గాలవారు యీ ప్రాయోపవేశాన్ని వినియోగించుకొంటున్నారని ఈ ముగ్గురు తమ తంతి విజ్ఞప్తిలో తెలియచేశారు. "ఆంధ్రరాష్ట్రం విషయమై భారత ప్రభుత్వ ప్రకటనకు వీలు కల్పించేందుకు ప్రాయోపవేశం విరమించండి. మీ ఉద్యమం జయప్రదం కావాలంటే, యీ విజ్ఞప్తిని పాటించడం అవసరం" అని వీరు స్వామీజీకి విన్నవించుకొన్నారు.

### ఎన్నికల తరువాత ఇస్తామని ప్రకటిస్తే చాలదు

#### వినోబాభావే ప్రశంగానికి స్వామీజీ సమాధానం

గుంటూరు, సెప్టెంబరు 20:

"స్వామీ సీతారాం తమ వైఖరిని మార్చుకొన్నారు. ఇప్పుడు వారు కోరేదల్లా ఎన్నికల తరువాత రాష్ట్రం యేర్పరుస్తామని ప్రభుత్వం ప్రకటించడమే" అని ఆచార్య వినోబాభావే, చిందా రావద్ద ప్రార్థన సభలో వెల్లడించారు. తమ వైఖరి మార్చుకోలేదని, అక్టోబర్ 2 నాటికే రాష్ట్రం రావాలని మొదటనుండీ తమ అడుగుతున్నామని, స్వామీ సీతారాంగారు, యివాళ వినోబాభావేకు తంతి పంపారు.

వినోబాభావే చిందా రావద్ద నిన్న ప్రార్థన సభలో యిలా అన్నారు

"స్వామీ సీతారాం ప్రాయోపవేశం మన అందరినీ తీవ్రంగా కలవర

(2-వ పేజీ చూడుడు)

## నలుగురూ అంగీకరిస్తే విభజన సంఘప్రతిపాదనలు ఆధారంగా ఆంధ్రరాష్ట్ర నిర్మాణం

### ప్రధానమంత్రితో తిరుమలరావుగారి సంప్రతింపులు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 19: ఆంధ్ర రాష్ట్రం విషయంలో ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ ఇంతవరకూ చేసిన వాగ్దానా లన్నింటినీ పాలించడానికి సిద్ధంగా ఉన్నారు. పార్లమెంటులోనూ, ఇతరత్రానూ ఆయన చేసిన ప్రకటనలకు ఇప్పటికీ కట్టుబడే ఉన్నారు.

విభజనసంఘ ప్రతిపాదనలు ఆధారంగా ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పాటు చేయవలసిందని ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ మాత్రమే తీర్మానించింది. ఇదే రీతిగా కర్నాటక, తమిళప్రదేశ కాంగ్రెసు సంఘాలు కూడా తీర్మానాలు చేసి ఈ తీర్మానాలను చెన్న రాష్ట్ర ప్రభుత్వం తన ఆమోదాన్ని భారత ప్రభుత్వానికి తెలియజేసిన వెంటనే, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం గురించి అధికారప్రకటన వెలువడుతుంది. ఈ విషయంలో ఎవరికీ ఎలాంటి సందేహాలూ ఉండవలసిన అవసరం లేదు.

అవి విభజనసంఘ ప్రతిపాదనలే గానీ, లేక మరొక తాజా ప్రతిపాదనలే గానీ ఆంధ్ర, కర్నాటక, తమిళ కాంగ్రెసు సంఘాలకూ, మద్రాసు ప్రభుత్వానికీ సమ్మతిమైతే వాటినాధారంగా ఆంధ్ర రాష్ట్రనిర్మాణానికి అవసరమైన చర్యలు తీసుకునేందుకు భారతప్రభుత్వం సంసిద్ధంగా ఉన్నట్లు అతివిశ్వసనీయవర్గాలద్వారా తెలుస్తున్నది.

కేంద్రప్రభుత్వ ఆహార శాఖ డిప్యూటీ మంత్రి శ్రీ తిరుమలరావుగారు స్వామీ సీతారాం ప్రాయోపవేశం వల్ల ఏర్పడిన పరిస్థితులను గురించి ప్రతిరోజూ ఉదయం, సాయంత్రం ప్రధానమంత్రితో చర్చిస్తూనే ఉన్నారు. పండిత నెహ్రూ అన్నమాట తప్పేవారు గాదనీ, అన్నమాట ప్రకారం పండిట్ నెహ్రూ ఆంధ్రులకు రాష్ట్రం ఇవ్వరనే భయం తమకు ఎన్నడూ లేదని శ్రీ తిరుమలరావుగారు ఆంధ్రపత్రిక ప్రత్యేక విలేఖరికి చెప్పారు.

స్వామీ సీతారాం ఆంధ్రరాష్ట్ర సమస్య నీవిధంగా ప్రవర్తించిన తరువాత వారికి ప్రాయోపవేశాన్ని విరమించి నిర్మాణాత్మకమైన చర్యల ద్వారా రాష్ట్రానికి రూపు రేఖలు ఏర్పరచడానికి ప్రయత్నించాలని ఇక్కడి శ్రీపురు ఆంధ్ర నాయకులు అభిప్రాయపడుతున్నారు.





## బ్రిటన్‌లో అక్టోబరు 25-న పార్లమెంటు ఎన్నికలు

లండన్, సెప్టెంబరు 19: అక్టోబరు 25 వ తేదీని బ్రిటనులో ఎన్నికలు జరుగుతవని ప్రధానమంత్రి క్లిమెంట్ అట్లీ నేటి రాత్రి ప్రకటించారు. కార్మికపక్ష ప్రభుత్వానికి ఇప్పటి పార్లమెంటులో అయిదుగురు సభ్యుల మెజారిటీ మాత్రమే ఉన్నది.

ప్రధానమంత్రి అట్లీ నతిరాత్రి జార్జి రాజుతో 75 నిమిషాలసేపు సంభాషణలు జరిపారు.

అక్టోబరు 5 వ తేదీని ఇప్పటి పార్లమెంటు రద్దుచేయబడుతుంది. అక్టోబరు 4 వ తేదీని పార్లమెంటు ఉభయ సభలు సంయుక్తంగా సమావేశం జరుపుతవి. కొత్త పార్లమెంటు అక్టోబరు 31 వ తేదీని సమావేశమౌతుంది. ఆరోజున సభ్యుల ప్రమాణ స్వీకరణ, అధ్యక్షుని ఎన్నిక జరుగుతవి. నవంబరు 6వ తేదీని జార్జి రాజు అధికారరీత్యా కొత్తపార్లమెంటును ప్రారంభోత్సవం చేస్తారు.

ఇప్పటి పార్లమెంటు 1950 ఫిబ్రవరి 23 వ ఎన్నుకోబడినది. ఎన్ని

(2-వ పేజీ చూడుడు)

## దేశవిభజనగాథ: మౌంట్‌బాటెన్ దౌత్యం

### ఆదివారంనుంచి 'ఆంధ్రపత్రిక'లో అనుదిన ప్రచురణ

భారతదేశ రాజకీయ సమస్యా పరిష్కారం విషయంలో బ్రిటిష్ మంత్రివర్గ పథకానికి ఏ కారణాలచేత స్వస్తి చెప్పవలసి వచ్చింది. కాశ్మీర్ సమస్య ఏ విధంగా ఉత్పన్నమైంది, అక్కడ జనవాక్య నిర్ధారణ ప్రసక్తిని ముందుగా ఎవరు తెచ్చింది. రజాకార్ల ఉదృతంతో హైదరాబాద్ సమస్య క్లిష్ట పరిణామాలకు ఏ విధంగా వచ్చింది. మౌంట్‌బాటెన్ ముఖ్య అంతరంగిక అనుచరుడుగా పనిచేసిన అలాన్ కాంప్‌బెల్ జాన్సన్ తన గ్రంథంలో సవిస్తరంగా ప్రకటించారు.

పంజాబు, బెంగాలు రాష్ట్రాల విభజనను మొదట ససేమిరా సమ్మతించని ముస్లింలీగు నాయకుడు జిన్నా బ్రిటిష్ కన్సర్వేటివ్ నాయకుడు చర్చిల్ వ్రాసినలేఖతో ఏ విధంగా అంగీకరించి దిగివచ్చింది. కాశ్మీర్‌పై కొండజాతుల దండయాత్రను జిన్నా ఏ విధంగా ఆదేశించింది. మొదలైన అనేక అత్యంత అంతరంగిక విషయాలు అధికార పూర్వకంగా మొట్టమొదటిసారిగా దీనిలో బయటపడినవి.

ఇప్పటివరకూ ప్రజాబాహుళ్యానికి తెలియని అనేక రహస్య విషయాలను తెలుసుకునే వసవకాశం ఈ వ్యాసావళివల్ల పాఠకులకు లభ్యమవుతుంది.

వీటిని తెలుగులో ప్రకటించే ప్రత్యేక హక్కులను 'ఆంధ్రపత్రిక' సేకరించిందని పాఠకులకు మనవి.

## గంటల పంచాంగం

ఖర సం॥ భాద్రపద బ॥ షష్ఠి
1951 సం॥ సెప్టెంబరు 21 శుక్రవారం
షష్ఠి సా 6-27 రో 24-0 వర్జ్యం రా 11-8 ల 12-54 కు.
బ॥ సప్తమి సెప్టెంబరు 22 శనివారం
సప్తమి రా 8-33 రో ప 7-56 వర్జ్యం ప 2-11 ల 3-59 కు.


# ఆంధ్రపత్రిక

ఒకరేయని యొనరించిన వరవం, యుక్తియము తన మనంబున కగు దా నొరులకు నవిసేయకునికి నదాయుణము నరమధర్మపథమునుకొలెన్. (మహాభారతము)

ఖర సం॥ భాద్రపద బ॥ షష్ఠి
శుక్రవారం


## దీక్షా విరమణ

స్వామి సీతారాం ప్రాయోపవేశం విరమించారు. ఆగస్టు 16 నుంచి వారితో బాటు ప్రాయోపవేశం చేస్తున్న శ్రీమతి దుర్గాంబ, శ్రీయుతులు బసవయ్యగార్లు అంతకు ఒకరోజు ముందు స్వామి సీతారాం అనుమతిపై, తమకు నమ్మతేకుండా కాకపోయినప్పటికీ, ప్రాయోపవేశం విరమించారు. రామలింగారెడ్డిగారు కొద్ది రోజుల క్రితమే స్వామి సీతారాం ఆదేశానుసారం ప్రాయోపవేశం విరమించారు. శ్రీయుతులు మద్దులేటి, సేతి చలపతి, సంపత్కుమారాచారిగార్లు స్వామి సీతారాంతోపాటు ప్రాయోపవేశం విరమించారు. ఈ సంతోషవార్తకు యావదాంధ్రము ఇప్పటికి నెలరోజులుగ అనుక్షణము నిరీక్షిస్తున్నది.

ప్రాయోపవేశం విరమించినా శ్రీమతి దుర్గాంబ, బసవయ్యగార్లకు ప్రమాదస్థితి పూర్తిగా తొలగలేదు. ఆంధ్ర మహాయజ్ఞంలో ఆగస్టు 16 నుంచీ పాల్గొంటున్న స్వామి సీతారాం, శ్రీమతి దుర్గాంబ, శ్రీయుతులు బసవయ్య, రామలింగారెడ్డి, మద్దులేటి, సేతి చలపతి, సంపత్కుమారాచారిగార్ల ఆరోగ్యస్థితి ఇప్పటికీ ఆందోళనకరంగానే ఉంది. వారు ఎన్నటికి సంపూర్ణ స్వాస్థ్యాన్ని పొందగలరో వైద్యులుకూడ చెప్పలేని స్థితి ఏర్పడింది. ఆంధ్రుల అదృష్టముకొద్ది పరమేశ్వరానుగ్రహమున వీరందరు ఈ ఆంధ్రమహాయజ్ఞ క్రతువు నుండి జయప్రదముగ బయటికి రాగల్గిరి. కాని స్వామి సీతారాం చెప్తూ వచ్చినట్లే వారు తమ భౌతికస్వరూపమును చూడాపు బలిదానమిచ్చి ఆంధ్రోద్యమమునకు ప్రాణప్రతిష్ఠ చేసినట్లు ఇదివరకు ఈ సందర్భమున అనేక పర్యాయములు చెప్పినట్లు ప్రత్యేకరాష్ట్రము విషయమై నిరాశచెంది నిస్పృహులై యున్న ఆంధ్రులకు స్ఫూర్తి తెచ్చి, నిరాశను తొలగించిన ఈ దీక్షావ్రతులకు ఆంధ్రావని కృతజ్ఞతా బద్ధమై యుండును.

ఆత్మ బలిదానము ద్వారానే ఇది సాధ్యమని స్వామి సీతారాం విశ్వసించెను. వారు మహోత్కంఠా ననుసరించినా వారి ఈ మహోన్నత లక్ష్యం సిద్ధించి యుండెడిదనే విదితరుల నమ్మకము. ఎవరి విశ్వాసమేమైనను, గతమునుగురించి వివాదపడక స్వామి సీతారాం ప్రభృతుల అపూర్వ నిరుపమాన త్యాగంవల్ల ఆంధ్ర రాష్ట్రావతరణకు ఏర్పడిన నేటి అనుకూల పరిస్థితులను చక్కగా వినియోగించుకొని కార్యమును సానుకూలము చేసుకొనుటే ప్రతిఒక్క ఆంధ్రునికర్తవ్యము.

ముప్పయి ఆరు రోజుల ప్రాయోపవేశంవల్ల శుష్కించిన దేహంతో స్వామి సీతారాం ప్రభృతులు ఆంధ్ర రాష్ట్రావతరణ శుభసమయమును ఆత్రముతో నిరీక్షించు చుందురు. వీరు తిరిగి ఆరోగ్యమును పొందుటకు ఇతర చికిత్సలకంటె రాష్ట్ర నిర్మాణము నకు జరుగు శీఘ్ర చర్యలే ఎక్కువగ ఉపయోగపడగలవు. ఫలోన్ముఖమైన వారి కృషి ఫలప్రదమై ఆ ఫలితమే వారికి తిరిగి సంపూర్ణారోగ్యమును ఇవ్వగలదు.

స్వామి సీతారాం ప్రభృతుల దీక్షావిరమణ యావదాంధ్రమునకు ఆనందదాయకము. ఆంధ్రులు స్వామి సీతారాం ప్రభృతుల నిర్ణయానికి ఎంతగా సంతోషిస్తున్నారో అంతకంటె ఎక్కువ బాధ్యతను వారు ఇకమీదట నిర్వహించవలసివుంది. ఆంధ్రరాష్ట్ర సత్వర నిర్మాణబాధ్యత ఇప్పుడు పూర్తిగా ఆంధ్ర నాయకుల మీదా, భారతప్రభుత్వంమీదా ఉంది. ఆంధ్రరాష్ట్ర నిర్మాణం విషయమై పండిట్ జవహర్లాల్ నెహ్రూ చాలా ఆత్రంగా ఉన్నారనీ, నాలుగు పక్షాలకు సమ్మతమైన పథకం తయారై అందుకు ఈ నల్గురు తమ సమ్మతిని ప్రకటించగానే ప్రధాన మంత్రి అవసరమైన చర్యలు తీసుకోగలరని అధ్యక్షుడు బాబు రాజేంద్రప్రసాద్ చెప్పారనీ ఆచార్య వినోబాభావే తెలియజేశారు. స్వామి సీతారాం ఆచార్య వినోబాభావే సలహాను పాటించి, రాష్ట్ర నిర్మాణమునకు తగు చర్యలు తీసుకొనబడగలవను విశ్వాసముతో ప్రాయోపవేశమును విరమించిరి. కాకా కలేల్కర్ గారు తమసందేశంలో వివరించినట్లు స్వామి సీతారాం ప్రభృతులు ప్రాయోపవేశం విరమించడంవల్ల పండిట్ నెహ్రూ బాధ్యత ఎక్కువైనది. ప్రధాన మంత్రి ఈ గురుతర బాధ్యతను నిర్వహించకలుగుటకు ఆంధ్రులు, రాష్ట్ర నిర్మాణ వ్యవహారముతో సంబంధము గలవారందరు వారితో సంపూర్ణముగమనఃస్ఫూర్తిగసహకరించవలెను. ప్రతిఒక్కరు, అగ్రహావేశ ఉద్రేకోత్సాహాలకులోనైపోక, తమ బాధ్యతలను వాస్తవిక దృష్టితో, కాలావసరములు గమనించి, తమ బాధ్యతలను నిర్వహించవలసిందనే మేము శుభ ముహూర్తమున చేయగల మనవి.

ముఖ్యంగా, నేడు, అత్యంత అవసరమైనది కార్య దక్షత, వివాదగ్రస్త విషయముల వివరణ గాదు; వాటి పరిష్కారానికి మార్గాన్వేషణ. ప్రజలను ఉద్రిక్తులను చేసే ప్రసంగాలు గాదు; ప్రశాంతంగా సమస్యల పరిష్కారానికి నాయకులు ఉపక్రమించుటకు తగిన వాతావరణం. ఆంధ్రులహక్కుల జాబితా ప్రకటనగాదు; న్యాయ సమ్మతమైన, ధర్మబద్ధమైన హక్కులను సాధించుటకు కార్యక్రమం.

స్వామి సీతారాం ప్రభృతులు క్షేమంగా, సంపూర్ణారోగ్యాన్ని పొందాలనీ, పరమేశ్వరుడు ఈ దీక్షావ్రతులకు పూర్ణాయుర్దాయమును ప్రసాదించాలనీ యావదాంధ్రము వ్యష్టిగానూ, సమష్టిగానూ ప్రార్థనలు జరిపి వీరియెడ తమ భక్తిప్రపత్తులను కృతజ్ఞతను వెల్లడించు చుందురుగాక !

## హిందూకోడ్ బిల్లు

### పార్లమెంటు చర్చ : ప్రభుత్వ విధానంపై సభ్యుల విమర్శ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 19: పార్లమెంటులో నేడు హిందూకోడ్ బిల్లును గూర్చి జరిగినచర్చలో సర్దార్ భూపేంద్రసింగ్ మాన్, పండిత గోవింద మాలవీయాలు మాట్లాడారు. ఇద్దరూ కూడా బిల్లునుతీవ్రంగావిమర్శించారు. పెళ్ళిళ్లు విడాకులు మొదలైన అంశాలకు సంబంధించినంతవరకు కూడాయీబిల్లు సిక్కులపట్ల అనువర్తింప జేసేందుకు వీలులేదని, సిక్కులు ఎన్నడూ మను ధర్మాన్ని గాని, బ్రాహ్మణ మతాన్ని గాని అంగీకరించినవారు కాదని, అందువల్ల వారిపట్ల యీ బిల్లులోని వివాదాస్పదాంశాలనుకూడా వర్తింపచేసేందుకు వీలులేదని సర్దార్ మాన్ హెచ్చరించారు.

సర్దార్ మాన్ ఉపన్యాసం ఇస్తూవుండగా సభ్య కార్యక్రమాదికొన్ని గూర్చిన చర్చవచ్చింది. ఈ సందర్భంలో న్యాయమంత్రి బిల్లు పేరుకూడా మార్చబడి, హిందూ వివాహము, విడాకులబిల్లు అని దీనికి నామకరణం జరగగల సావకాశం కూడా వుందని అన్నారు.

పండిత మాలవీయా : ఆ విధంగా బిల్లు పేరును మారిస్తే మాకుకొంతవిసులు బాటు కల్గుతుంది. అందుకుతగిన సవరణలను ప్రతిపాదించండి.

డా॥ అంబేద్కర్ : ప్రభుత్వాన్ని శంకించవలసిన అవసరం నాకున్నట్లు కనిపించడం లేదు.

పండిత మాలవీయా : ప్రభుత్వాన్ని శంకించడం. డాక్టర్ న్యాయమంత్రి పాశ్చాత్య దృష్టి వ్యంగా వుంది. ఇప్పుడు ఇందులో రెండు ప్రకరణములనే చర్చించవలసివుంటే, మాలో చాలామందికి పరిస్థితులు మారినట్లు భావన కల్గవచ్చు.

డా॥ అంబేద్కర్: రెండో అంశాన్ని ఓటుకు పెట్టినప్పుడు, అనంతరం కొన్ని సవరణలు తీసుకురాగలందులకుసావకాశంకోసం సభవారిని అర్థిస్తాను.

పండిత మాలవీయా: ఈ వైఖరి పట్టి నియంతృత్వపద్ధతిలాగా వుంది. దాన్ని ప్రజాస్వామ్యం అనరు.

ఇంతలో డిప్యూటీస్పీకరు కల్పించుకొని, సభ్యులు ఈ విధంగా సాభిప్రాయ వివేచనాలతో మాట్లాడ్డం తగదని, అన్ని ఇతర అంశాలను ఓటుకు పెట్టిన అనంతరమే ఈ రెండో అంశాన్ని ఓటుకు పెట్టగలనని వివేదం చేసారు.

అసలు పెళ్లి, విడాకులు వీటిని గూర్చి ఇదివరకే అన్ని రాష్ట్రాలలోను శాసనాలు వున్నాయి గనుక, ఇప్పుడు ఈ బిల్లు కోసం శాసనప్రయం అవసరమేమని శ్రీ రామలింగం చెట్టియార్ అన్నారు. శ్రీ చెట్టియార్ను శ్రీమతి దుర్గాబాయి సవాలు చేసి అన్ని రాష్ట్రాలలోను ఇట్టి శాసనాలు లేవని, మూడు రాష్ట్రాలలో మాత్రమే వున్నాయని, అందువల్ల ఈ విషయమై కేంద్ర శాసనం ఒకటి అవసరమని వాదించింది.

ఆతర్వాత పండిత గోవింద మాలవీయా మాట్లాడారు. ఈ బిల్లులోని ప్రతి అంశము కూడా హిందూధర్మాన్ని కాకటి (వెళ్లతో సహా) మాపు మాపేదిగావున్నదని, హిందూధర్మ శాస్త్ర విహితంగా ఈ బిల్లులోని అంశాలు రచింపబడినట్లు వాదించడం అసహజంగా వున్నదని ఆయన అన్నారు. హిందూ ధర్మం అంతటికీ వివాహం అన్నది మూలపీఠం. అందువల్ల దాన్ని కదుపు దామనిచేసేప్రయత్నమైజనవాక్యగ్రహణంలో నిమిత్తం లేకుండా జరిగేందుకు వీలులేదు. అని పండిత మాలవీయా వాదించారు.

ఈ బిల్లు ధర్మశాస్త్రాలు ఆధారంగా రచింపబడిందన్న వాదాన్ని ఖండించిన అనంతరం, ఆయన ఈ బిల్లు ఏ విధంగా దాన్ని రచించిన వారి తెల్లోంచి, తెలివి చేటల్లోంచి పూడిపడిందో వివరించారు. నిజంగా ఈ బిల్లులోని అంశాలు ధర్మశాస్త్రాలు ఆధారంగా నిర్పడినట్టే అయినే, బిల్లులో అంశం అంశాన్ని, మాటమాటని చర్చించడానికి సావకాశం ఇచ్చి, మాయాంసావిహితంగా అనిపున్నాయో లేదో పరిశీలించడానికి ప్రభుత్వం జంకవలసిన అవసరం కన్పించడని ఆయన వాదించారు. అదీకాక ఈ బిల్లును 'బి. సి.' రాష్ట్రాలలో ప్రకటించక పోవడం వల్ల దీని స్వరూపం వివిధంలో అక్కడి వారికి ఎవ్వరికీ తెలియదు. అట్లా ఇంతిమంది జనాభాను చీకటిలో వుంచి, ఇట్టి బిల్లును ఆమోదింపజేయడానికి ప్లానుకోవడంలో ఏమి న్యాయం వుందో వివారించవలసిందిగా కూడా ఆయన ప్రభుత్వం వారిని కోరారు.

పండిత మాలవీయా ఉపన్యాసం ఇంకా పూర్తికాలేదు. రేపు ఇంకా ఆయన మాట్లాడుతారు. ఆయన అనంతరం మరెవ్వరికీ సావకాశం ఇవ్వక రెండో అంశంమీద చర్చను ముగింపుకు తెచ్చే నిశ్చయాన్ని నేనుడిప్యూటీ స్పీకరు ప్రకటించారు.

## అట్లాంటిక్ ఒడంబడికలో స్పెయిను

### బ్రిటనుకు ప్రాతికూల్యం

ఒండీ (స్కాట్లండు), సెప్టెంబరు 18: అట్లాంటిక్కు రాజ్యాల ఒడంబడికలో స్పెయిను చేరడానికి బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరించుట లేదని బ్రిటిష్ యుద్ధశాఖా మంత్రి బాబ్ స్ట్రాచిగారు నేడు చెప్పిరి.

# ఇరాన్ ప్రధాని అంత్యసందేశంవల్ల పరిస్థితి ఇంకా విషమిస్తుంది

## ముసాదిక్ కొత్త ప్రతిపాదనలేమీ చేయలేదు: బ్రిటన్ కుహారిమన్ పంపకపోవడానికికారణాలు

వాషింగ్టన్, సెప్టెంబరు 19: డాక్టర్ ముసాదిక్ పంపిన "అంతిమ సందేశం" లో కొత్త ప్రతిపాదనలేమీ లేవని సూచిస్తూ, దానిని బ్రిటన్కు అందచేయడంవల్ల పరిస్థితి మరింత విషమిస్తుందనే కారణంపై దానిని బ్రిటన్కు అందచేయడానికి అమెరికా అధ్యక్షుని ప్రతినిధి అవిరల్ హారిమన్ నిరాకరించారు.

పదిహేను రోజులలో ఈ సమస్య పరిష్కారం కాకపోతే అబదాన్లో ఇంకా మిగిలివున్న బ్రిటిష్ పనివారిని దేశంనుండి బహిష్కరించడం జరుగుతుందని పర్షియా ప్రధాని ముసాదిక్ తన సందేశంలో తెలియపరిచారు. ప్రస్తుత పరిస్థితిని ఇక ఎంతమాత్రము సహించడానికి వీలు లేదని కూడా ఆయన తన లేఖలో ప్రకటించారు.

ఆయన లేఖకు సమాధానంగా హారిమన్ ఇలా వ్రాశారు:—"మీ లేఖను బ్రిటన్కు అందచేయడంవల్ల అంగీకారం కుదిరే అవకాశాలు సంపూర్ణంగా అంతరించగలవు.

బ్రిటిష్ పనివారిని బహిష్కరించదలచుకున్నట్లు మీరు హెచ్చరించారు. ఈ బెదిరింపుతో పరిస్థితి మరింత విషమిస్తుంది. మీ ప్రతిపాదనలలో క్రొత్త ఏమీలేదు. పైగా అవి కొన్ని సందర్భాలలో లోగడ మీరు చేసిన ప్రతిపాదనలకు కూడా భిన్నంగా ఉన్నవి. ఈవివాదం పరిష్కారం అయ్యేటట్లు చేయడానికిగాను సహాయం చేయడానికి నేను సంసిద్ధంగా ఉన్నాను. కాని వాణిజ్యానికి, నూనె పరిశ్రమ నిర్వహణకు సంబంధించిన విషయాలను మీరు గుర్తించి, మీవైఖరి మార్చుకొనకపోతే రాయబారాలవల్ల ప్రయోజనమేమీ ఉండదు. అందువల్ల మీ ప్రతిపాదనలను పునః పరిశీలించి, రాయబారాలు ప్రారంభించడానికి అనుకూలమైన పరిస్థితులు కల్పించమని కోరుతున్నాను."

డాక్టరు ముసాదిక్ తన ఆఖరి సందేశంతోపాటు హారిమన్కు సెప్టెంబరు 12న ఒక లేఖపంపారు. దానికి హారిమన్ పైవిధంగా సెప్టెంబరు 15న సమాధానం పంపారు. ఆ రెండులేఖలను నేడిక్కడ ప్రకటించడం జరిగినది.

డాక్టర్ ముసాదిక్ చేసిన ప్రతిపాదనలు, వాటిపై హారిమన్ చేసిన విమర్శ ఈక్రింది విధంగా ఉన్నవి:

(1) విదేశీయ సాంకేతిక పనివారు వుండవలసిన అవసరాన్ని గుర్తిస్తూ, వారు ఒక బ్రిటిషు మేనేజరు క్రింద పని చేయాలనే బ్రిటిష్ ప్రతిపాదనను ముసాదిక్ నిరాకరించారు. బ్రిటిషు నిపుణులు, తటస్థ దేశాలకు చెందిన నిపుణులు, పర్షియా ప్రభుత్వ ప్రతినిధులు ఉండే అధికారవర్గం క్రింద వారు పని చేయాలని ముసాదిక్ ప్రతిపాదించారు. ఈ రకమైన సంస్థ నూనె పరిశ్రమ సక్రమనిర్వహణకు తగినది కాదని హారిమన్ విమర్శించారు. (2) నూనె పరిశ్రమ జాతి పరంచేస్తూ చట్టం చేయడానికి ముందు ఆంగ్లో-ఇరానియన్ నూనె సంస్థ వాటాలకున్న విలువ ప్రాతిపదికగా కాని, లోగడ నూనె పరిశ్రమలను జాతిపరం చేసిన ఇతర ప్రజాస్వామ్య దేశాలు అవలంబించిన పద్ధతి పైగాని, లేక ఉభయ పక్షాలకు అంగీకార యోగ్యమైన పద్ధతిపై గాని నష్ట పరిహారం నిర్ణయించాలని ముసాదిక్ ప్రతిపాదించారు. చెల్లించాలనే కోరిక ఉన్నంతమాత్రంచేత ప్రయోజన మేమీ లేదని, చెల్లించ గలిగిన శక్తి కూడా ఉండాలని హారిమన్ సూచించారు. ఇరాన్లో ఉత్పత్తి అయ్యే నూనె అంతటినీ వివిధ దేశాలతో విక్రయించే అధికారం బ్రిటిషు సంస్థకు ఇవ్వడం ఒక్కటే సంతృప్తికరమైన విధానం అని ఆయన అన్నారు. సాలుకు బ్రిటన్కు అవసరమైన ఒక కోటి టన్నుల నూనె విక్రయించడానికి ముసాదిక్ అంగీకరించారు. కాని, నూనె ఇతర దేశాలకు రవాణా చేయడానికి, సరఫరా చేయడానికి తగిన సాధన సంపత్తున్న బ్రిటిషు సంస్థ ద్వారానే నూనె అంతటినీ విక్రయించాలని హారిమన్ సూచించారు. (3) బ్రిటన్కు అవసరమైన 1 కోటి టన్నుల నూనె బ్రిటన్కు కేటాయించి, తతిమ్మా నూనె స్వయంగా విక్రయించగోరుతున్నట్లు డాక్టర్ ముసాదిక్ తెలియపరిచారు. లోగడ బ్రిటిష్ప్రభుత్వంఎన్నుకునే సంస్థతో దీర్ఘకాల ఒడంబడిక జరుపుకుని నూనె అంతటినీ విక్రయించడానికి పర్షియా అంగీకరించిన కారణంచేత ఈ ప్రతిపాదన దానికి విరుద్ధమని హారిమన్ విమర్శించారు.

## పర్షియా మంత్రివర్గ పునర్నిర్మాణం

టెహరాన్, సెప్టెంబరు 19: పర్షియా ప్రధాని డాక్టర్ ముసాదిక్ త్వరలో నే తన మంత్రివర్గం పునర్నిర్మించనున్నట్లు నేడిక్కడ అధికార రీత్యా ప్రకటన జరిగినది. ప్రస్తుతం మంత్రివర్గంలో అయిదు స్థానాలు ఖాళీగా ఉన్నవి. ఆర్థికశాఖామంత్రి ఆలీవరస్తే తనపదవికి రాజీనామా సమర్పించారు. కాని ముసాదిక్ ఆయనకు ఇంకా సమాధానం పంపలేదు.

టెహరాన్లోని అమెరికన్ రాయబారి డాక్టర్ గ్రేడీ తనపదవినుండి విరమించుకుని నేడిక్కడినుండి విమానములో అమెరికాకు బయలుదేరారు.

పర్షియాను సూనెసరఫరా చేయమని రష్యాకోరినట్లు పర్షియాప్రభుత్వ ఆర్థిక శాఖాధికారులవల్ల తెలుస్తున్నది. సోవియట్ రాయబారి ఇవాన్ సద్చికోవ్ ఈ రోజున ప్రధాని ముసాదిక్ను కలుసుకుంటారట. ఆయన ఒక నెల సెలవుమీద రష్యాకు తిరిగి వెళ్ళుతున్నారు. వారి సమావేశం రష్యా, పర్షియాలమధ్య కొత్తవాణిజ్య ఒడంబడికకు ప్రాతిపదిక కావచ్చునని తెలుస్తున్నది.

నూనెకుమారుగా పంచదార పరిశ్రమకు వలసిన యంత్రాలు, వరకుల ఎగుమతిగాను రైలుమార్గాలు నిర్మించ డానికి అవసరమైన పరికరాలు ఎగుమతిచేయమని పర్షియా రష్యాను కోరినదట.

అబదాన్లో పర్షియా జాతీయ నూనెసంస్థ ఈరోజున ఇరువురు ఆంగ్లో ఇరానియన్ సంస్థ ఉన్నతాధికారులను ఆదివారంలోగా దేశంవిడిచి పొమ్మని ఉత్తర్వుచేసినది. కన్నింగ్ హామ్, డడ్లీబోల్ల వసతి పత్రాలను జాతీయ నూనెసంస్థ రద్దుచేసినది.

డాక్టర్ ముసాదిక్ కొత్త ప్రతిపాదనలు పరిశీలించడానికి బ్రిటిష్ మంత్రి రిచర్డుస్టోక్సు అంగీకరించలేదని లండన్లో విదేశాంగ కార్యాలయం ప్రతినిధి ఒకరు నేడు ప్రకటించారు.

## ప్రకాశం పంతులుగారి ఆరోగ్యస్థితి

మద్రాసు, సెప్టెంబరు 20: టంగుటూరి ప్రకాశంపంతులుగారు శస్త్రచికిత్స జరిగిన పిదప గోచా బలహీనంగానున్నా క్రమంగా కోలుకుంటున్నారు. స్వల్పంగా దగ్గు బాధిస్తోంది. కడపకోటిరెడ్డి బి. ఎస్. మూర్తి మున్నగువారు నేడు వారిని చూచివచ్చారు. స్వామీజీ ప్రభృతుల యోగక్షేమాన్ని నేడు పంతులుగారు విచారించినప్పుడు, ఇవాళటికి స్వామీజీ, వారిశిష్యులు ప్రాయోపవేశం ప్రారంభించి 36 రోజులు అయిందనీ, శ్రీ వినోబాభావే ప్రేరణపై వారు నేడు అపరాహ్ణంనుంచీ ప్రాయోపవేశాన్ని విరమిస్తున్నారనీ, మద్రాసునుగూర్చి రంగా గారు చేసిన ప్రకటనను స్వామీజీ ఖండించారనీ పంతులుగారికి సన్నిహితులు నివేదించగా, పంతులుగారు తమహర్షాన్ని తెలియచేశారు. స్వామీజీ ప్రభృతులు విజయాభినివేశంతో ప్రాయోపవేశాన్ని గుంటూరులో విరమించడం, ఇక్కడ పంతులుగారు త్వరగా కోలుకుంటూ ఉండటం ఆంధ్రదేశానికి శుభావహమని పంతులుగారి అంతరంగికులు ఒకరు తెలిపారు.

పాలడుగు ఆదినారాయణగారు ఇట్లా వ్రాస్తున్నారు: పంతులుగారిని నేను బుధవారం, గురువారం చూశాను. వారి ఆరోగ్యపరిస్థితి తృప్తికరంగా ఉన్నది. అయిదారు రోజుల్లో నర్సింగుహోంనుంచి ఇంటికి రావాలనుకుంటున్నారని అన్నారు. స్నేహితులు ఆదుర్దా పడవద్దని పంతులుగారు నాతో చెప్పినారు."

పంతులుగారు కార్యదర్శి చేసిన ప్రకటన పైరోజ్ చోట ప్రకటింపబడింది.

## స్పీకరుగా థామస్ ఎన్నిక

తిరువనంతపురం, సెప్టెంబరు 19: ఎ. యం. థామస్గారు (కాంగ్రెసు) తిరువాంకూరు-కొచ్చిన్ శాసనసభకు స్పీకరుగా ఇవాళ మధ్యాహ్నం ఎన్నికైనారు.

## బ్రిటన్లో ఎన్నికలు

(1 వ పేజీ తరువాయి)

కల ఫలితంగా కార్మికపక్షం మెజారిటీ తగ్గినది.

ప్రస్తుతం పార్లమెంటులోని వివిధ పక్షాల బలాబలాలు ఇలాఉన్నవి:

కార్మికపక్ష సభ్యులు 318 కన్సర్వేటివ్ పక్షసభ్యులు 298 లిబరల్స్ 9. ఇండిపెండెంట్సు 1. ఐరిష్జాతీయ వాదులు 2. అధ్యక్షుడు 1. మూడు స్థానాలు ఖాళీగావున్నవి.

ఎన్నికల విషయమై శాడిమోలో ప్రసంగిస్తూ, ప్రధాని అట్లీ ఇలా చెప్పారు: "కామన్సుసభలో చాల కొలదిమంది సభ్యుల మెజారిటీతో మాత్రమే కార్మికపక్షం గత 18మాసాలుగా ప్రభుత్వ వ్యవహారాలు నిర్వహిస్తున్నది. ప్రభుత్వంపట్ల ప్రజల విశ్వాసం తెలుసుకుని, పార్లమెంటులో తగినంత మెజారిటీ సంపాదించడానికి తగినసమయం వచ్చినదని నా అభిప్రాయం. ప్రస్తుతం మనం ఎదుర్కొంటున్న ప్రధాన దేశాంతర విదేశాంగ సమస్యల పరిష్కారానికి తగినంత మెజారిటీ అవసరం."

# ఇండియాలో టెలివిజన్ స్థాపనకు ప్రభుత్వ కృషి

న్యూఢిల్లీ, సెప్టెంబరు 20: టెలివిజను ఇండియాలో కూడా ప్రవేశపెట్టే సావకాశాలనుగూర్చి ప్రభుత్వంవారు ఆలోచిస్తున్నారని ప్రసారావార మంత్రి శ్రీ ఆర్. ఆర్. దివాకర్ నేడు పార్లమెంటులో వెల్లడిచేశారు.

## ప్రాయోపవేశ విరమణ

1-వ పేజీ తరువాయి

యీ మహాయజ్ఞం రేపు మధ్యాహ్నముతో సంపూర్తి కావాలనే నిర్ణయానికి వచ్చారు."

"గుంటూరులోను, యావదాంధ్రలోను వారితోపాటు ప్రాయోపవేశం చేస్తున్న వారందరూ తక్షణం ప్రాయోపవేశం విరమించవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ ఉద్యమ భవిష్యదభివృద్ధి మీ చేతుల్లో వదులుతున్నాను. దయామయుడైన పరమేశ్వరునికి మన కృతజ్ఞత తెలుపుకొందాం."

### ఆంధ్రమహాయజ్ఞం ఫలించినట్లే

ఆంధ్రమహాయజ్ఞంలో వినోబాభావే అంతటి మహావ్యక్తి జోక్యం కల్పించుకోవడంవల్ల ఆంధ్రరాష్ట్రవిషయం న్యాయవిచారణలో పడిందని యిక్కడ భావిస్తున్నారు. స్వామి సీతారాంచేత ప్రాయోపవేశం విరమించే బాధ్యత ఆచార్య వినోబాభావే తనపై వేసుకొన్నారు. పైగా "సత్వర ఆంధ్రరాష్ట్రనిర్మాణం విషయమై పండిట్ జవహర్లాల్ నెహ్రూ శక్తివంచనలేకుండా కృషి చేస్తున్నారనే గట్టి నమ్మకం తనకు కల్గిందని" ఆయన తన విజ్ఞప్తిలో స్వామీజీకి తెలియజేశారు. దీనినిబట్టి యీ మహాయజ్ఞం ఫలించిన ఆశాభావం కన్పిస్తున్నా, యిప్పటికి యిదమిత్థమైన ఫలితం కానరాని అనిశ్చితస్థితి ప్రారంభమైనదనే చెప్పాలి. స్వామీజీ దీక్ష ఫలితము, సర్వోదయమునకు విజయ మేననియిక్కడ అనుకొంటున్నారు. స్వామీజీ దీక్ష, యించుమించు ప్రతి ఆంధ్రుడిలోనూ, విపరీతమైన ఆందోళన జనింప చేసిందని, ప్రతి నాయకుడిలోనూ శ్రద్ధలేక పుట్టించిందనీ, ఒక పెద్దమనిషి అన్నాడు.

వినోబాభావే ప్రమేయం కల్పించుకొనడంచేత, యిక కొద్ది రోజుల్లోనే ఆంధ్రరాష్ట్రం అవతరించ గలదని స్వామీజీ భావిస్తున్నారు.

### దీక్షావిరమణ ప్రకటన

ప్రశాంతవాతావరణంలో, అర్ధరాత్రివేళ—సరిగా 1 గంటప్పుడు—ప్రాయోపవేశదీక్ష విరమింప నిశ్చయించుకున్నట్లు స్వామీజీ ప్రకటించారు. ఆ సమయాన స్వామీజీ వద్ద, యిద్దరు పత్రికావిలేఖరులు, ఏకాంజనేయులు యస్. వి. యల్. నరసింహారావు, కీరం సుబ్బారావు, డా॥ అనుంచర్ల చలపతిరావు సేతి చలపతి రావు గారలు మాత్రమే ఉన్నారు. స్వామీజీ దీక్ష విరమిస్తున్నట్లు ప్రకటించగానే, ఆ వార్త అప్పటికప్పుడే పట్టణం నలుమూలల్లో వ్యాపించింది. తెల్లవారకముందే, అనేకమంది వచ్చి, స్వామీజీకి తమ నమోవాకములు తెలుపుకొన్నారు. ఈ దీక్షావ్రతులంతా మళ్ళా మామూలు ప్రాపంచిక జీవితంలోకి ప్రవేశిస్తున్నారని తెలియడం, అందరికీ యేదో పెద్దభారం తొలగినట్లయింది. నిన్న నె ప్రార్థన సమావేశంలో స్వామీజీ ప్రసంగిస్తు,సర్వజనులకు అమూల్యమైన ఒక మహాదాశయాన్ని సాధించే ప్రయత్నంలో, ప్రతిఒక్క రూ తమకు అత్యంత ప్రియమైన దానినికూడా త్యాగం చేయుటకు సిద్ధపడాలని, ఎవరికైనా అత్యంత ప్రియమైనదీ ప్రాణమే గాదు దానిని త్యజించుటకు వెనుదీయరాదని చెప్పారు. ఇట్లా చెప్పిన తమకు ప్రియతముడైన స్వామీజీని కోల్పోవుటకు యెవరికీ యిష్టంలేదు. గనుక ఆయన ప్రాయోపవేశం విరమించనున్నారని తెలియగానే వృద్ధయ్యాన్ని కృంగతీస్తున్న మహాభారం తొలగించినట్లు అంతా సంతసించారు. వైద్యశాస్త్రంమీద నమ్మకంలేకుండా, కేవలం ఆత్మవిశ్వాసాలనే అంటిపెట్టుకొని ఉన్నవారిని జాగ్రత్తగా కనిపెట్టుకొండే భారము తమకు తొలగిపోయిందని డా॥ చలపతి రావుగారు కూడా సంతోషించారు. ప్రాణముంటే లక్ష్యం లేనివారికి ప్రాణంమీద దీపికల్గించేందుకు ప్రయత్నించడం నిరుపయోగమని డా॥ చలపతి రావుగారి అభిప్రాయం.

నడింపల్లి నరసింహారావుగారు మా విలేఖరితో మాట్లాడుతూ, స్వామీజీ ప్రాయోపవేశం విరమించమని అడగడంతో, వినోబాభావే ఆంధ్రరాష్ట్ర నిర్మాణం విషయంలో మధ్యవర్తిత్వం ప్రారంభించినట్లేనని అన్నారు. స్వామీజీ ప్రాయోపవేశ విరమణ నిర్ణయం యావదాంధ్రులకు మనశ్శాంతి కల్గించిందని, వినోబాభావే మధ్యవర్తిత్వం సత్ఫలితం సమకూర్చగలుగుతుందని జి.వి. పున్నయ్య శాస్త్రిగారన్నారు.

దీక్షాపరుల బంధుమిత్రులు నేడులు జస్వేంటనే యజ్ఞశాలకువచ్చి ఆనందాశ్రువులు రాల్చారు. సరిగా 36 రోజుల 14 గంటల ఉపవాసానంతరం, స్వామీజీ, ఆయనశిష్యులు, యీ మధ్యాహ్నం పండ్లరసం పుచ్చుకున్నారు.

చుట్టుప్రక్కల గ్రామాలనుండి నైలను తండోపతండాలుగా ప్రజలు స్వామీజీ దర్శనార్థం వస్తున్నారు. ఉన్నవ లక్ష్మీనారాయణ, జి. వి. పున్నయ్యశాస్త్రి, టి. వి. యస్. చలపతిరావు, చింతలపేరి భావయ్య, పర్వతనేని వీరయ్య, సుదర్శనం వల్లభజోస్యుల సుబ్బారావు ప్రభృతులు యింకా అనేకమంది స్వామీజీ దర్శనం చేసుకొన్నారు. మామిడి తోరణాలతో శోభాయమానంగా అలంకరింపబడిన యజ్ఞశాల ప్రేక్షకులతో కిటకిటలాడుతూన్నది.

### మద్రాసువర్గాల సంతోషం

మదరాసు సెప్టెంబరు 20: స్వామి సీతారాం ప్రాయోపవేశాన్ని విరమించారన్న వార్త యిక్కడ అధికార అనధికార వర్గాలలో చాలా సంతోషం కలిగించింది. ముఖ్యంగా విద్యార్థి బృందం చాలా ఆనందించారు. శ్రీ ప్రకాశంగారికి యీ సంగతి వారి సన్నిహితులు తెలియజేసినప్పుడు వారు సంతోషించారు. ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి భవిష్యత్ కర్తవ్యాన్ని గూర్చి ప్రభుత్వ వర్గాల వారు ఆలోచిస్తున్నారు. తమిళ కాంగ్రెస్ నాయకులు యీ నెలాఖరు వరకు ఎన్నికల సంఘ సంచార కార్యక్రమం నిర్వహించుకొన్నారు. అక్టోబరు రెండవ తేదీ వరకు అభ్యర్థుల నిర్ణయంలో నిమగ్నులై యుంటారు. ఈలోపు తమిళ కాంగ్రెస్ సర్వసభ్య సమావేశం జరిగే అవకాశం కన్పించటం లేదని తమిళ కాంగ్రెస్ సన్నిహిత వర్గాలవారు చెబుతున్నారు. ఈ అభ్యర్థుల నిర్ణయం ముగియడంతో అక్టోబరు మాసంలో బహుశా కాంగ్రెస్ సమావేశం ముందో తరువాతనో పిలుపు చేసుకొని సమావేశం నిర్ణయిస్తారనుకొంటున్నారు. కర్నాటక కాంగ్రెస్ సర్వసభ్య సమావేశంకూడా యీ లోపల జరుగగలదని ఆశింపబడుతోంది. ఆంధ్రకాంగ్రెసుకు తోడు తమిళకర్నాటక కాంగ్రెసు సంఘాలు ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని గూర్చి తీర్మానించిన తరువాత మదరాసు ప్రభుత్వంవారు విభజనసంఘ తీర్మానాల ఆధారంగా ఆంధ్రరాష్ట్ర నిర్మాణం చేయవలెనని తీర్మానం చేయగలరు. భారతరాజ్యాంగం, 3వ నిబంధన అనుసరించి భారత రిపబ్లిక్ ప్రెసిడెంటు ఆంధ్రరాష్ట్ర బిల్లు ముసాయిదాను పంపిస్తూ రాష్ట్ర శాసనసభవారి అభిప్రాయాలను తెలుసుకోదలుచూ మదరాసు ప్రభుత్వంవారికి రాయవలసి ఉంటుంది. మదరాసు శాసనసభవారు తమ అభిప్రాయాలను తెలిపినతరువాత పార్లమెంటులో ఆంధ్రరాష్ట్ర విభజన బిల్లు తీసుకొని రావడానికి రిపబ్లిక్ అధ్యక్షుడు సిఫారసు చేయాలి. అప్పుడు పార్లమెంటు ఆమోదించిన తరువాత ఆంధ్రరాష్ట్ర నిర్మాణం అమలు జరుగుతుంది.

మదరాసు అసెంబ్లీ అక్టోబరు ఆఖరువారంలో రెండ్రోజులు పాటు జరగటానికి కార్యక్రమం ఏర్పాటుచేశారు. ఈలోపల యీ వివరాలన్నీ ముగియవని అందువల్ల అక్టోబరు సమావేశంలో ఈ విభజన బిల్లు ప్రస్తావన రాకపోవచ్చని ప్రభుత్వ వర్గాలవారు అంటున్నారు.

ఒకసారి ఆంధ్రరాష్ట్ర నిర్మాణం విషయమై అందుకు సంబంధించిన నాయకులు ఒక ఒప్పందానికి వచ్చినపుడు కొన్ని నెలలు అటూ యిటూగా ఆంధ్రరాష్ట్రం రాగలదని అందు విషయమై తొందరపడ నవసరములేదని తమిళ నాయకులు అంటున్నారు.

ఈ కార్యక్రమాన్నంతా దృష్టిలో నుంచుకొని పండిత నెహ్రూతో మాట్లాడివచ్చిన నాయకులు ఎన్నికలు అయిపోయి కొత్త శాసనసభ వచ్చిన తరువాత ఏడాదిలోపల ఆంధ్రరాష్ట్రం రాగలదని అంటున్నారు.

### రామలింగారెడ్డిగారికి స్వామీజీ అభినందన

బాగలపుట్టి, సెప్టెంబరు 16: "ఆంధ్ర రాష్ట్రసిద్ధికి నీ తపస్సే చాలును. ఆంధ్రమాత నిన్నుగూర్చి గర్వించవచ్చును. ఇక ఉపవాసం నీ యిచ్ఛానుసారం విరమించవచ్చు"—నని స్వామి సీతారాం రామలింగారెడ్డిగారికి లేఖ వ్రాశారు.

ఉత్సాహంతో దీర్ఘోపవాసాన్ని సాగించినందుకు రామలింగారెడ్డిని స్వామీజీ అభినందిస్తూ "నిముగన్న తల్లిదండ్రులు ప్రశంసాపాత్రులు" అన్నారు.

ప్రజానీకంలో రాష్ట్రనిర్మాణాన్ని గురించి యింకా విరివిగా ప్రచారం గావించాలని స్వామీజీ తమ లేఖలో కోరారు. రామలింగారెడ్డిగారుపూర్తిగా నీరసించిన కారణంగా మిత్రుల ప్రోద్బలమువల్ల 80 రోజుల ఉపవాసానంతరం నిన్నటిదినము ఉపవాసవిరమణ జేసి కొద్దిగ నిమ్మపండురసాన్ని తీసుకున్నారు.

## త్వరలో అధికార ప్రకటన

(1 వ పేజీ తరువాయి)

పెరుగుతున్నది. ఆంధ్ర రాష్ట్రోద్యమం పట్ల ఎంత సానుభూతియున్నా ఎంత సహాయం లో పూవకొన్నా, అక్టోబరు 2 నాటికి

## కాంగ్రెసులో కిద్వాయ్ పునః ప్రవేశం

(స్వకీయ విలేఖరి)

న్యూఢిల్లీ, సెప్టెంబరు 20: కొద్దిరోజులక్రితం కాంగ్రెసులోనుండి వెళ్లిపోయిన రఫీ అహమ్మద్ కిద్వాయ్ గారు తిరిగి కాంగ్రెసులో ప్రవేశించబోతున్నట్లు తెలుస్తున్నది. ఈ వారాంతంలోగా ఆయన యీ విషయమై ఒక ప్రకటన చేయనున్నారని కూడా తెలిసింది.

ఆంధ్రరాష్ట్రం యేర్పరచడం మానవ సాధ్యమైన పనిగాదు అని భారత ప్రధాని నెహ్రూ చెప్పారు. అందుపై స్వామి సీతారాం తమ వైఖరిని పునర్విమర్శించుకొన్నారు. ఇప్పుడువారు కోరుతున్నట్లు ఎన్నికల తర్వాత, నిర్వివాదమైన జిల్లాలతో రాష్ట్రం యేర్పరుస్తామని అక్టోబరు 2 లోగా భారత ప్రభుత్వం ప్రకటించాలనే మిగతా వివాదగ్రస్తమైన జిల్లాల విషయములోనూ, మద్రాసు నగరం విషయంలోనూ, సరిహద్దు సంఘాన్ని మధ్యవర్తి సంఘాన్ని నియమించాలని, ఆయన మొదట కోరినదానికి, ఇప్పుడు కోరుతున్న దానికి చాలా వ్యత్యాసం ఉన్నది. ఇది ఆచరణ సాధ్యం గాకపోదని నా తలంపు" వినోబాభావే, యివాళ పండిట్ నెహ్రూకు సిమ్లాలో ఉన్న డా॥ రాజేంద్రప్రసాద్ కు తంతి పంపారు.

"పండిట్ నెహ్రూ యిచ్చినహామీల దృష్ట్యా యిప్పుడు ప్రాయోపవేశం విరమించి నట్లయితే, ఆంధ్రరాష్ట్ర నిర్మాణం సుగమం కాగలదని" వినోబాభావే యీ ప్రార్థన సమావేశంలో అన్నారు.

వినోబాభావే చింద్వారా ప్రార్థన సమావేశంలో వెల్లడించిన అభిప్రాయాలు సరిగావని చెబుతూ, స్వామి సీతారాం యివాళ గుంటూరునుంచి యీ తంతి పంపారు,

"ఎన్నికల తరువాత ఆంధ్రరాష్ట్రం యేర్పాటు చేస్తామని అక్టోబర్ 2 లోగా ప్రభుత్వం ప్రకటిస్తే చాలునని నే నెన్నడూ అనలేదు. అక్టోబర్ 2 నాటికే ఆంధ్రరాష్ట్రం యేర్పడాలని నేను మొదటినుంచీ అడుగుతున్నాను ఈ విషయం తమరు గమనించి, భారత రిపబ్లిక్ అధ్యక్షునికి, ప్రధాన మంత్రికి నా వైఖరిని స్పష్టం చేయాలి."

## వినోబాభావే శ్రద్ధ

చింద్వారా, సెప్టెంబరు 19: సత్వరఆంధ్రరాష్ట్ర సంపాదనార్థం గుంటూరులో 36 రోజులుగా స్వామి సీతారాం కొనసాగిస్తున్న ప్రాయోపవేశం గురించి ఆచార్య వినోబాభావే చాలా ఆందోళన పడుతున్నారు.

స్వామీజీ ఆశయం గురించి ఆచార్య వినోబాభావే, డా॥ రాజేంద్ర ప్రసాదుకు లోగడ తంతిపంపారు. ఈ తంతికి రాజెన్బాబు సమాధానమిస్తూ, రాష్ట్ర నిర్మాణానికి సంబంధించి యాపార్టీల సమ్మతిపై ప్రధాన నెహ్రూ నిరీక్షిస్తున్నారని, వినోబాజీకి తెలియజేశారు.

స్వామి సీతారాం ప్రాయోప విషయములో తన ఆందోళన తెలుపు ప్రధాని నెహ్రూకు కూడా ఆచార్య వినోబాభావే తరచుగాతంతి పంపుతున్నట్లు తెలుస్తున్నది. ప్రాయోపవేశం యెప్పటికప్పుడు ఏ స్థితిలో ఉన్నది వినోబాజీ విచారించి తెలుసుకొంటున్నారు.

స్వామీజీ ఆరోగ్యం క్షీణిస్తున్నదని ఆయన అనుచరులు వినోబాభావేకు తంతిపంపితే, తను దైవానుగ్రహం వల్ల పలాసాగా ఉన్నానని, తమరు (వినోబాజీ) ప్రమేయం కల్పించు కొన్నందులకు కృతజ్ఞుణ్ణి అని స్వామీజీ వినోబాభావేకు తంతిపంపారు

## మదరాసు ధరలు

మదరాసు, సెప్టెంబరు 20.

బంగారు-వెండి నేటిమధ్యాహ్నం గంటల వరకు 1.8 ఎక్కువతక్కువ నేపలు ధరలు: ఒకటి ధ. 77-0-0 సెన్లాలంగారు తులం 118.0 0 మూన బంగారు 109 8.0 పీడుకెండి తులం 100-8 (కెడి) 189.8.0 వెండి తులం 1 8 1.15.0.

వేరుశెనగ: (531 వా 1.8 ఎక్కువతక్కువ గిడ్డంగుల మెషిన్ పేట్టుబడితో సహా)

| | |
|---|---|
| వలివి (ధాన్యం) | రు. 179-180 |
| కడిసి | రు. 182-184 |
| వేరుశనగనూనె ఎక్సుపెల్లర్ ఐలో 3% తాముదల్ (500 వా.) | రు. 355-0-0 |
| కొంతాయు మాల (37½ వీసలు గల డబ్బ) | |
| ఒకటి- | |
| క్యూలా | రు. 39-14 9 |
| యస్. బ్రాండ్ | 40.0-9 |

ఆముదం

500 వీసలు గల బారువ ఒకటి

| | |
|---|---|
| "విదువర్తురా" | రు. 410-0-0 |
| వరసాంధ్రపేట" | రు. 420-0 0 |

వంచదార

| | |
|---|---|
| పుగదార్ | రు. 103-4-8 |
| పోర్స్ | రు. 108-14-5 |

## హైదరాబాదు (ఉస్మాన్గంజ్)

(వర్తయదారు గుహ్య ఉద్యుగ్న వినంతయం)

హైదరాబాదు, సెప్టెంబరు 20: బంగారం తులం 1కి 130-0-0; వెండి 100 కు 214.0 0

వడ్లు ఒకటికి పల్లు 50-75 పెసలు 40-45-8-0 కందులు 44-48 మినుములు 66-67-6-0 అలకలు 52-8-0-53 ఉలవలు 42 48 కందిపప్పు పెద్దది 64-66 కందిపప్పు చిన్నది 63 62 పెసరపప్పు 62 63 మినపపప్పు 105-110 పేరుశనగపప్పు 95 98 ఆముదాలు 88 90 చింతపండు 30-45 మిర్చి 110-170 ఉప్పు 50 56 వనిదాలు 16 కెర పసుపు 15. 27 ఉల్లి 11-12 ఒక్కరు 30-48.

## బొంబై వెండి బంగారు మార్కెట్

బొంబై, సెప్టెం 20: నేటిమధ్యాహ్నం 2-0 గంII లకు బొంబై వెండి-బంగారు మార్కెటుధరలు: వెండి (100 తు) రు 185-1-0, బంగారం (రు 1కి) రు 110-5-0, సావరిన్ 1కి రు 76-14-0.

## ఏలూరు మునిసిపాలిటి టెండరు నోటీసు

**సుమారు రు 29,835/- లు**

ఖరీదు చేయు రోడ్డు, బిల్డింగు పనులకు నిర్ణీత ఫారములలో సీలు వేసిన టెండర్లు 5-10-1951 తేది సాయంత్రము 4 గంటలవరకు ఏలూరు మునిసిపాలిటి, కమీషనరుగారిచే తీసుకొనబడును. రోడ్డు పనుల టెండరుక్రింది (శ్రీ నరులలో) ఒక్కొక్కదానికి రు 1/- వంతున ఇతర ఒక్కొక్క పనికి రు 1/- వంతున చెల్లించి టెండర్లు ఫారములు పొందవచ్చును. మిగిలిన వివరములు దరఖాస్తు మీద మునిసిపల్ యింజనీరునుండి తెలిసికొనవచ్చును.

ఎస్. సుబ్బారావు,
15-9-51. కమీషనరు.

## నోటీసు

**మద్రాసు స్మాల్ కాజెస్ కోర్టు**

దావా నం. 3281 ఆఫ్ 1951.

వాది: మద్రాసు కో-ఆపరేటివ్ మోటార్ ట్రాన్సుపోర్టు సొసైటీ లి.
ప్రతివాది: ఏ. వి. చలపతి, నివాసం సర్ రాజపాడు గ్రామం, కడప జిల్లా.

**లారీల బాడుగ చార్జీల దావా**

వాది రు ... లు వసూలు చేసుకొనుటకు వేసిన దావా తేది 5-10-51 తేది మా కోర్టులో విచారణకు వాయిదా వేయబడినదని ప్రతివాదికి తెలుపడమైనది. ఆరోజు ప్రతివాది హాజరుకానిచో, ఆతని పరోక్షమున దావా తీర్మానింపబడును.

ఇ. కన్నియప్పన్,
టి. ఆర్. రామచంద్రన్,
వాది తరఫు కౌన్సెల్.

## కావలెను

**దిగువ కేంద్రములలో మా**

ఇంగ్లీషు దినపత్రిక యొక్క హోల్ డిస్ట్రిబ్యూషను, అమ్మకమునకు చురుకైనవారును, పలుకుబడి గల ఏజంట్లు కావలెను.

1. ఒంగోలు (గుంటూరు జిల్లా)
2. నిడదవోలు (ప. గోదావరి జిల్లా)
3. నరసాపురం ( డిట్టో )
4. రామచంద్రపురం (తూ. గో. జిల్లా)
5. తణుకు (ప. గో. జిల్లా)
6. నరసారావుపేట (గుంటూరు జిల్లా)
7. పర్లాకిమిడి (గంజాం జిల్లా)
8. సోంపేట (విశాఖపట్టణం జిల్లా)
9. తిరుపతి (చిత్తూరు జిల్లా)
10. కడప
11. ద్రోణాచలం (కర్నూలు జిల్లా)
12. హాస్పేట (బళ్లారి జిల్లా)
13. శ్రీకాకుళం
14. బొబ్బిలి (విశాఖపట్టణం జిల్లా)
15. బళ్లారి
16. అనంతపురం
17. ఏలూరు (ప. గో. జిల్లా)
18. భీమవరం (ప. గో. జిల్లా)
19. కైకలూరు (కృష్ణా జిల్లా)
20. పాలకొల్లు (ప. గో. జిల్లా)

వివరములకు నిబంధనలకు దిగువ అడ్రెసుకు వ్రాయండి:—

ఇండియన్ రిపబ్లిక్,
మద్రాసు-8.



## ఒరిస్సా తెలుగు విద్యార్థులపరీక్షాపత్రాలు

### 52 జూన్ వరకు తెలుగులోనే వ్రాయవచ్చు

బరంపురం, సెప్టెంబరు 15: గంజాం, కోరాపుట్టి జిల్లాలలోని ఆంధ్రవిద్యార్థులకు మెట్రిక్యులేషన్ పరీక్షలో పరీక్షా పత్రాలు తెలుగులో వ్రాసే సౌకర్యం కొరకు జరిగిన ఆందోళన ఫలితంగా, యీ నెల 8వ తేదీని జరిగిన ఉత్కళ విశ్వవిద్యాలయ ఎకడమిక్ కౌన్సిలులో, యీ సౌకర్యం 1952 జూన్ వరకు యిచ్చుటకు తీర్మానించడమైనది. ఈ విషయము వైస్ ఛాన్సెలర్ చింతామణి ఆచార్యగారు, బరంపురం ఎడ్వొకేటు అయ్యగారి వెంకట సుబ్బారావుగారికి వ్రాసిన ఉత్తరంలో యిలా తెలియజేశారు:

"భాషకు సంబంధించిన అల్పసంఖ్యాకుల విషయమై నాకు సానుభూతి లేదనుకోకండి. అలాంటి అల్ప సంఖ్యాకులకు సౌకర్యములు రాష్ట్రాల పరస్పర సహకారంమీద ఆధారపడి ఉంటుంది.

"నేను మధ్యను కలకత్తాకు వెళ్లి అచ్చటి వైసుఛాన్సెలర్‌ని, మద్రాసు వెళ్లి అచ్చటి విద్యాశాఖ మంత్రిని స్వయంగా కలసికొని మాట్లాడగా, వారి విషయమై ఆలోచిస్తామన్నారు. సంప్రతింపులు జరుగుతుండగా, యీ సౌకర్యము రద్దు చేయడం నాకిష్టం లేదు.

"8వ తేదీని యీ విషయం ఆలోచించుటకు ఎకడమిక్ కౌన్సిలు యొక్క ప్రత్యేక సమావేశము నేర్పాటు చేశాను. ఎంతో ప్రతికూలాభిప్రాయమున్నా, యీ సౌకర్యం, జూన్ 1952 వరకు ఉండవలసిందని తీర్మానం ఆమోదింప చేయించాను. ఇతర రాష్ట్రాలు ఒరియా విద్యార్థులకు యిలాంటి సౌకర్యం యివ్వకపోయినట్లయితే, యిదే ఆఖరుసారి యిలాంటి సౌకర్యం ఆంధ్రవిద్యార్థులకు కలగచేయటం ఇది స్వాభావికమని, మీరు గ్రహించాలి. మీరు ఆంధ్ర విద్యార్థుల సౌకర్యం ఎంత కాంక్షిస్తున్నారో, ఒరియా ప్రజలు కూడా, వారి విద్యార్థుల కొరకు అలాంటి సౌకర్యాలను కాంక్షిస్తారు. అందుచేత యీ విషయమై అంతిమ నిర్ణయం ఎంతత్వరగా అయితే అంత మంచిది. మీరు మద్రాసు విద్యాశాఖమంత్రి గారికి దయచేసి యీ విషయం జ్ఞప్తికి తెచ్చి, యీ వివాదమును ఆలస్యం కాకుండా ముగించవలసినదని ప్రార్థించ వలసినది. నేను కూడా ఆయనకు యివాళ వ్రాస్తున్నాను.

"మీరు ఆశ్రద్ధవహించకండి. ఈ సౌకర్యం ఒక్క సంవత్సరం వరకే. మళ్లీ జూన్ 1952 తర్వాత, మళ్ళీ యీ సౌకర్యం మరి కొన్నాళ్ళియమని నేను స్థైర్యంలో ఎకడమిక్ కౌన్సిలును అడగలేను." (స్వ. వి.)

### సారా దగ్గర ఉంచుకొన్నందుకు 3 నెలల శిక్ష

మంగళగిరి, సెప్టెంబరు 14: సారా దగ్గర వుంచుకొన్నందులకు తేలు అప్పారావు, చిక్కాల సూర్యనారాయణలకు స్థానిక సబ్ మేజస్ట్రేటు గారు చెరి 2 మాసముల కఠినశిక్ష, వెట్టి బుల్లయ్యకు 3 మాసముల కఠినశిక్ష విధించారు. త్రాగినందులకు మెల్లం ప్రాడి హనుమంతుకు రు 50/- లు జుల్మానా విధించారు.

పాలలో నీరు కలిపి అమ్మినందులకు తాడిబోయిన రత్తయ్యకు రు 100/- లు వల్లగొండ ఆదెమ్మకు రు 50/- లు, పి. యం. రాఘవకు రు 75/- లు జరిమానా విధించారు.

## విజయవాడ-ఒంగోలు డీసెల్ రైళ్లు

### వేయవలసిందిగా చీరాల పత్రికావిలేఖరుల విజ్ఞప్తి

చీరాల, సెప్టెంబరు 18: వాల్తేరు-మద్రాసుల మధ్య దూర్లీకేటు మెయిలును నడుపవలెననీ, ఒంగోలు-విజయవాడల మధ్య డీసెల్ రైళ్లు వేయునని సదరన్ రైల్వే అధికారులను కోరుతూ స్థానిక పత్రికావిలేఖరులు ఆర్. డి. నాథంగారి అధ్యక్షతను నేడు జరిపిన సభలో తీర్మానించారు. (స్వ. వి.)

### విశాఖపట్టణం జిల్లా కాంగ్రెసు సమావేశం

ఎలమంచిలి, సెప్టెంబరు 18: ఎన్నికల సంఘంవారు విశాఖ జిల్లాలో యీ 23 న పర్యటిస్తున్నందున యీ 23 న జరుగవలసిన విశాఖజిల్లా కాంగ్రెసు సమావేశం యీ 29 కి వాయిదా వేసినట్లుగా కార్యదర్శి ఎం. సూర్యనారాయణమూర్తి గారు తెలుపుతున్నారు.

### సిమెంటు బ్లాకు మార్కెటు: భీమవరం వర్తకునిపై కేసు

భీమవరం, సెప్టెంబరు 16: దుర్గా బ్రాంచి సిమెంటు డిపో యజమాని మంతెన రంగరాజుగారిపై పోలీసు సర్కిల్ ఇన్స్పెక్టరు జి. శ్రీమంత్ గారు సిమ్మెంటు బస్తాలు రెండు బస్తా 1 కి రు. 6-10-0 లు చొప్పున అమ్మినందుకు కేసు రిజిస్టరు చేశారు. వీరి స్వగ్రామం కోడుకొల్లు-నుమారు నాల్గు సం॥ల నుంచి భీమవరంలో వడ్డీవ్యాపారం సిమెంటు వర్తకం చేస్తున్నారు. పోలీసువారు సదరు రంగరాజు సిమెంటు బ్లాకుమార్కెటులో అమ్ముచున్నట్లు వీరి ఒక మనిషి ద్వారా సదరు 2 బస్తాలు కొనిపించారు. (స్వ. వి.)

### కృష్ణాజిల్లాలో స్పెషల్‌పోలీసు సిబ్బందికి ఉద్వాసన

విజయవాడ, సెప్టెంబరు 17: కృష్ణాజిల్లాలో కమ్యూనిస్టు దౌర్జన్యాలను నిర్మూలించుటకు గాను ప్రత్యేకంగా యేర్పాటు చేయబడిన "స్పెషల్ డ్యూటీ పోలీసుసిబ్బందికి" త్వరలోనే ఉద్వాసన చెప్పబడునని, అక్టోబరునుండీ యీ పోలీసు సిబ్బందిని మామూలు శాంతిభద్రతల రక్షణకు నియోగింపబడడం జరుగుతుందని తెలియవచ్చింది.

జిల్లాలో శాంతిభద్రతల పరిస్థితి చాలావరకు బాగుపడినందున, గత 9 నెలలుగా కమ్యూనిస్టు దౌర్జన్యచర్య లెక్కడా లేకపోవడంవల్ల, యిదీగాక ఎన్నికలు కూడా త్వరలోనే జరుగనుండుటవల్ల, యీ నిర్ణయం జరిగినట్లు తెలుస్తున్నది.

ఈ స్పెషల్ డ్యూటీ పోలీసు సిబ్బందిని, మూడేండ్లక్రింతం, అనగా కమ్యూనిస్టు దౌర్జన్యాలు తీవ్రంగా ఉన్నప్పుడు, రాష్ట్ర ప్రభుత్వం యేర్పాటు చేసింది. (యు. పి. ఐ.)

### కీ॥ శే॥ చక్రవర్తుల తాతాచార్యులుగారు

నిడదవోలు, సెప్టెంబరు 17: మద్రాసు కాపురస్థులు శ్రీ చక్రవర్తుల తాతాచార్యులుగారు రాజమండ్రి వైద్యశాలలో మరణించారు. వీరి వయస్సు 60 సం॥రాలు. సంతానం లేనందున, తాను కలిగివున్న ఆస్తిని, గ్రామంలో ధర్మపత్రికనకు, ఉచిత వైద్యశాల నిర్మాణమునకు గాను విల్లు వ్రాసి యిచ్చారు.

### కీ॥ శే॥ పిరాట్ల శంకర శాస్త్రి గార్లు

జగ్గయ్యపేట, సెప్టెంబరు 18: గాన విద్యాశేఖర పిరాట్ల శంకర శాస్త్రిగారు, మూడు రోజులుగా పక్షవాతవ్యాధితో బాధపడుతూ గత రాత్రి 12 గం॥లకు మరణించారు. వీరి వయస్సు 70 సం॥లు. శాస్త్రిగారు మద్రాసు ముత్యాలపేట త్యాగయ్యగారి శిష్యులు. వీరికి యిద్దరు కుమారులు, ఒక కుమార్తె ఉన్నారు.

వీరి శిష్యబృందము పురజనులు ఉత్తరక్రియలకు హాజరైనారు. వీరి మృతికి సంతాపసూచకంగా పట్టణంలో దుకాణాలన్నీ మూసివేయబడినాయి.

### కీ॥ శే॥ రామచంద్ర కవిగారి సానుభూతి సభలు

#### యలమంచిలి

ఈ 18 న రామలింగేశ్వర స్వామి వారి ఆలయంలో గుంటూరు వెంకట సుబ్బారావుగారి అధ్యక్షతన పురజనుల సభజరిగినది. గొబ్బూరు వెంకట రాఘవరావుగారు కీ॥ శే॥ మాకెపల్లి రామచంద్ర కవిగారి జీవితచరిత్రను వారి గుణగణాలను ప్రశంసిస్తూ మాట్లాడారు. రామచంద్ర కవిగారి మరణమునకు సంతాపమునూ, వారి కుటుంబమునకు సానుభూతిని తెలుపుతూ సభవారు తీర్మానం చేశారు.

#### అనకాపల్లి

ఆంధ్ర భాష కొరకు ఆంధ్ర రాష్ట్రము కొరకు, భారతి స్వాతంత్ర్యము కొరకు అపారసేవచేసిన మాకెపల్లి రామచంద్రశాస్త్రిగారి గుణగణాలను ప్రశంసిస్తూ, వారి మరణమునకు సంతాపము తెలుపుతూ కవితాసమితివారు తీర్మానంచేశారు.

## చీరాల పురపాలక సంఘ నివేదిక

### చైర్మన్‌చర్యలపై 9 మంది సభ్యుల నిరసన

చీరాల, సెప్టెంబరు 11: పురపాలక సంఘ ప్రత్యేకసమావేశం నిన్న చైర్మన్ అన్నదాని నరేంద్రుడుగారి అధ్యక్షతను జరిగింది. 20 మందిలోనూ 18 మంది సభ్యులుహాజరైనారు. కమిషనర్ జనాబ్ షేక్ మహీద్ గారు కూడా సభలో పాల్గొన్నారు. కమిషనరు తయారుచేసిన 1950-51 చీరాలపరిపాలన నివేదికను చీరాల కృష్ణారావుగారు చదివి వినిపించారు. గత సంవత్సర పరిపాలన నివేదికలోపాటు చైర్మన్ గారు గావించిన లోపాలను తెలుపుతూ మరొకపత్రాన్ని జతపరచిపంపాలని రావుల గోవేంద్రనాథంగారు ప్రతిపాదించారు. తాటికొండ వెంకటేశ్వర్లు శ్రేష్ఠిగారు బలపరిచారు. ప్రతి నెలా సమావేశాలు జరుపలేదనీ, తీర్మానాలను యింగ్లీషులో వ్రాయలేదనీ, ప్రభుత్వ ఉత్తరువులను ఎప్పటికప్పుడు కౌన్సిలుకు నివేదించలేదనీ, పరిపాలన నివేదిక ప్రతులను కౌన్సిలర్లకు ముందుగా పంచిపెట్టలేదనీ, అకేండా ప్రతులను పత్రికావిలేఖరులకు పంపుతున్నారనీ, కౌన్సిల్ ఆమోదము లేకుండానే గ్రామానికివచ్చిన పెద్దలకు స్వాగత పత్రాలసమర్పణ జరుగుతున్నదనీ, చైర్మన్ గారిపై 9 ఆరోపణలు చేశారు. ఈ ఆరోపణలను తొలగించటానికి ప్రయత్నించ చేస్తామని చైర్మన్ గారు వాగ్దానం ఇచ్చినప్పటికీ వుపపాదనను సభ్యులు ఉపసంహరించుకో నిరాకరించారు. సభ్యులు పట్టుపట్టిన మీదట ఆక్షేపణలతోసహా నివేదికను కౌన్సిల్ ఆమోదించింది. ఈ ఆక్షేపణ పత్రముపై మొత్తం 9 మంది సంతకాలు చేశారు. స్వ. వి.

### చీరాల పరిసరాలలో 12 దొంగ మగ్గాలు

చీరాల, సెప్టెంబరు 11: ఒంగోలు సబ్ కలెక్టరు ఏ. కృష్ణస్వామి, స్థానిక డిప్యూటీ తహశీల్దారు బి. రాజారావు, టెక్స్టైల్ యిన్స్పెక్టరు పి. వి. చలమయ్యనాయుడు, రెవెన్యూ యిన్స్పెక్టరు షేక్ అబ్దుల్లా గార్లలో కలసి చీరాల, పేరాల, వేటపాలెం, జాండ్రపేట గ్రామాలలోని చేనేత మగ్గాలను ఆకస్మికంగా తనిఖీ చేశారు. చేనేత పారిశ్రామికుల యిండ్లను పరిశీలించిన మీదట 12 దొంగమగ్గాలు వున్నట్లు తేలాయి. వాటికి సంబంధించిన కార్డులు రద్దుచేస్తారు. (స్వ. వి.)

### సోంపేట తాలూకాలో ఎరువుల కరవు

సోంపేట, సెప్టెంబరు 15: ఈ తాలూకా కాంగ్రెసు సంఘ సభ్యుడు యల్. యన్. పాణిగ్రాహిగారు ఇలా తెలుపుతున్నారు. "ఈ తాలూకాలో అమ్మోనియం సల్ఫేటు, ఫాస్ఫేటు, మొదలైన రసాయనిక ఎరువులు కరవుగా అయినా. రసాయనిక ఎరువుల నిమిత్తం అప్పులు బహు కొద్దిమంది రైతులకే యిచ్చారు. బండి పట్టాలకు దరఖాస్తులు పెట్టుకొన్న వారిలో చాలమందికి ఆశాభంగం కల్గింది. కాబట్టి ప్రభుత్వం వెంటనే, ఎరువులను, బండిపట్టాలు మొదలైన వ్యవసాయ పరికరాలను రైతులకు అందచేయుటకు తగు యేర్పాట్లు చేయాలి."

### గుంటూరుకు సివిల్ సప్లయిస్ కమిషనరు రాక

గుంటూరు, సెప్టెంబరు 18: సివిల్ సప్లయిస్ శాఖ కమిషనరు వి. ఎస్. హేజ్మాడీగారు యిక్కడకు వచ్చి అనేక సకలార్థ సాధక సహకార సంఘాలను, అధికాహారోత్పత్తి కార్యక్రమాలను పరిశీలించారు. అధికాహారోత్పత్తి ప్రణాళిక ననుసరించి యీ జిల్లాలో 29 వేల టన్నుల అదనపు పంట అందవలసి వుండగా యిప్పటికి 20,328 టన్నులు పండించగలిగారని పత్రికా విలేఖరుల సమావేశంలో హేజ్మాడీగారు తెలిపారు. బియ్యం రేషన్ పెంపు జరిగే అవకాశం లేదని చెప్పారు. కాల ధటసంఘానికి రాష్ట్ర కమిషనరు కూడా అయిన హేజ్మాడీగారు పట్టణ కాలధటుల సస్తేకవాన్ని సందర్శించి, వారి త్రవిథులనుగూర్చి చెప్పారు.

### తెనాలిలోతాలూకా కమ్యూనిస్టు పార్టీ కార్యాలయం

తెనాలి, సెప్టెంబరు 16: తెనాలి గాంధీచౌకులో తాలూకా కమ్యూనిస్టు కార్యాలయం తిరిగి ప్రారంభించారు. తాలూకాలోని కమ్యూనిస్టులు కొంతమంది నిన్న టి దినం కమ్యూనిస్టు పతాకములు ధరించి తెనాలి పురవీధులలో నినాదాలు చేస్తూ వూరేగారు. (స్వ. వి.)

#### తెనాలి

హేజ్మాడీగారు యిక్కడకు యీ 18 న వచ్చారు. వారివెంట జిల్లాకలెక్టరు పి. పి. ఐ. వైద్యనాథన్, జిల్లా సరఫరాధికారి జి. సింహాద్రినాయుడు తదితరులు వచ్చారు. స్థానిక రహదారిబంగళాలో మిల్లు యజమానులు వీరిని దర్శించి తమ కష్టాలను విన్నవించుకొన్నారు. ఈ అధికారబృందం పెదరావూరుకు వెళ్లగా అక్కడి రైతులు ధాన్యసేకరణ వల్ల తమకు కలుగుచున్న యిబ్బందులను విన్నవించారు. హేజ్మాడీగారు సావధానంగా విని తగిన సహాయం చేయుగలమన్నారు. (స్వ. వి.)

### కృష్ణానది నీటిమట్టం

ఈ 16వ తేదీ ఉదయం విజయవాడ వద్ద కృష్ణానదినీరు ఆనకట్టకు 7.2 అడుగులు పైగా ప్రవహిస్తున్నది.

## వెంకటేశ్వరశాస్త్రి గారి స్వారస్వత సేవ

### ద. భా. పత్రికారచయితల సంఘంలో చిత్ర పటావిష్కరణ

మదరాసు, సెప్టెంబరు 19: ద. భా. పత్రికారచయితల ప్రెస్ క్లబ్ లో నిన్న సాయంత్రం ఫెడరేటెడ్ ఇండియా సంపాదకులు శ్రీ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రి, జర్నలిస్టు, రచయిత శ్రీ కె. వ్యాసారావుగార్ల చిత్రపటాలను శ్రీ కె. పి. విశ్వనాథఅయ్యర్ గారు ఆవిష్కరించారు. శ్రీ యస్. రఘునాథఅయ్యరు అధ్యక్షత వహించారు.

చిత్రపటములను మునిసిపల్ కవున్సిలర్ శ్రీ కె. యం. సుబ్రహ్మణ్యం గారు బహూకరించారు. వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రి, వ్యాసారావుగార్ల భాషాసేవలను గూర్చివారు అనిపిన సందేశమును సభలో చదివారు.

శ్రీ ఖాసా సుబ్బారావుగారు సభికులకు స్వాగతమిచ్చి శ్రీ శాస్త్రిగారు వయ్యి గ్రంథాలను ప్రచురించారనీ వారాపని చేసియుండకచో అమూల్యములగు గ్రంథాలనేకం నాశనం అయిపోయి వుండవని అన్నారు. శ్రీ వ్యాసారావుగారు స్థానిక సంస్థల ద్వారా ప్రజాసేవ చేస్తూ వచ్చినవారన్నారు.

శ్రీ కె. పి. విశ్వనాథ అయ్యర్ మాట్లాడుతూ ఒక సంస్కృతి గ్రంథం కావలసి వచ్చినప్పుడు తమకు శాస్త్రిగారికి పరిచయం అయిందనీ శాస్త్రిగారి కుటుంబం సంస్కృతిసాహిత్యానికి అమోఘమైన సేవ చేశారన్నారు. ఈ తిర మదరాసులో కాలాఅజార్ వ్యాధివచ్చినప్పుడు శ్రీ పి. త్యాగరాయశెట్టితో కలిసి శాస్త్రిగారు చేసిన సేవను మరవజాలమన్నారు. వ్యాసారావుగారు ఆనాడు కొలది జర్నలిస్టు లక్కటి ఇంగ్లీషు వ్రాసేవారు. వారి ప్రతిభను గుర్తించి కస్తూరిరంగ అయ్యంగార్ లాంటి సంపాదకులు రావుగారిచేత పౌర సమస్యల మీద వ్యాసాలు వ్రాయించేవారని చెప్పారు.

శ్రీ యస్. రఘునాథఅయ్యర్ చిత్రపటాలను స్వీకరించి శాస్త్రిగారు ప్రెస్ క్లబ్ కు పెద్ద విరాళమిచ్చారని చెప్పారు.

### గుండేరు మురుగుకాలువ బాధితుల కోర్కెలు

బందరు, సెప్టెంబరు 11: దివి-బందరు తాలూకాలలో ప్రవహిస్తున్న గుండేరు గంజకాల్వవల్ల ఏటేటా రైతులుపొందుతున్న నష్టాన్ని తొలగించటానికి లోగడ నే తయారైవున్న అంచనాలను అవసరమైన మార్పులతో వెంటనే అమలు జరుపవలసిందిగా కృష్ణా జిల్లా సూపరింటెండింగ్ యింజనీరు గారిని కోరుతూ నిన్న సాయంకాలం గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారి అధ్యక్షతను జరిగిన గుండేరు మురుగు బాధిత రైతుల మహాసభవారు తీర్మానించారు. ఈ ప్రణాళికకుగాను కాగల వ్యయంలో ఎంత మొత్తం కావలంటే అంత మొత్తాన్ని ప్రజలవద్ద నుండి వసూలుచేసి అప్పుగా ప్రభుత్వానికి యీయగలమని కూడా సభవారు ప్రకటించారు. ఈ సందర్భంలో ప్రభుత్వం వద్దకు రాయబారం వెళ్లటానికి గొట్టిపాటి బ్రహ్మయ్య, అడ్డపల్లి లక్ష్మీనరసింహం, పాటిబండ్ల హనుమంతరావు, మాలెంపాటి వెంకటకృష్ణయ్య గార్లతో కూడిన ఒక సంఘాన్ని ఏర్పాటు చేశారు. మోపిదేవి 'సర్ప్లస్ వియర్సు' నుండి ప్రతి సంవత్సరము ప్రభుత్వం 1½ మైలుమాత్రం కాలువ త్రవ్విస్తున్నారు. మురుగుకాల్వను మొదటినుండే కొడాలి వరకు వెడల్పు చేయవలసిందిగా ప్రభుత్వాన్ని అర్థించారు. మురుగు కాలువ యిరుప్రక్కల వాగులు సేద్యానికి రైతులకు పట్టాలు యిచ్చిన కారణంగా అవాంతరాలు అంతకంతకూ యెక్కువ అవుతున్నాయి. ఇకపై అట్టిపట్టాలు యీయక, యిచ్చిన వాటిలో చాలాభాగం రద్దు చేయటానికి ప్రభుత్వం పూనుకోవాలని అన్నారు. చల్లపల్లికి దక్షిణంగా వున్న బంద్రేవు కోడురు లోతుగాను, వెడల్పుగాను చేసి పలుగుల గండివద్ద గుండేరు లాకులు పడవలసిందిగా సూచించారు. గుండేరు అయినంపూడి మురుగు కాలువల ముంపునివారణకు ప్రభుత్వానికి కొన్ని సూచనలు చేశారు. స్వ. వి.

### తెనాలిలో కలరా: 5 గురి మరణం

తెనాలి, సెప్టెంబరు 18: ఈ పట్టణంలో కలరావ్యాధి వ్యాపిస్తున్నది. యిప్పటికి 5 గురు మరణించినట్లు తెలుస్తున్నది.

### కొత్త వైద్యకళాశాలలు

మదరాసు, సెప్టెంబరు 18: సంవత్సరానికి వందమంది విద్యార్థులను తీసుకొనుటకు వీలుగా గుంటూరులో వైద్యకళాశాల స్థాపనకు సంబంధించిన స్కీమును ప్రభుత్వం మంజూరుచేసి అందు నిమిత్తం రు 5935000 ల ఖర్చును ఆమోదించారు. అదేవిధంగా మధురలో కాలేజీని స్థాపించుటకు కూడా మంజూరుచేశారు.

### మదరాసురాష్ట్ర ఆయుర్వేద ఔషధశాలల సంఘం

పైసంఘ సర్వసభ్య సమావేశం ఈ నెల 23 వ తేదీని మదరాసు సాహుకార్పేటయందుగల మా ఆయుర్వేద ఉచిత ఆయుర్వేదవైద్యశాలలో మధ్యాహ్నం 2 గంటలకు జరుగుతుంది.

## నోటీసు

### పరిశ్రమలకు మద్రాసుప్రభుత్వ సహాయ చట్టము 1922 (1923 సం.పు V-వ ఆక్టు)

**ఇందు మూలముగ తెలియ** పరచునదేమనగా, హాగాసు క్రీడయింగ్ నిమిత్తము మెషినరి, ఎక్విప్మెంటు కొనుటకును బిల్డింగులను నిర్మించుటకును గుంటూరులోని గౌరి మాన్యునందలి శ్రీ ఎం. గౌరీశంకర్ గారు రు 3,00,000 ల ఋణమును కోరుచు, పరిశ్రమలకు మద్రాసు ప్రభుత్వ సహాయచట్టము 1922 (1923 సం॥పు 5-వ ఆక్టు) క్రింద, మద్రాసు ప్రభుత్వమునకు దరఖాస్తు పెట్టుకొనియున్నారు.

సదరు సహాయము మంజూరు చేయుటకు ఎవరికైనా ఆక్షేపణలున్నయెడల, తాము హాజరై ఆక్షేపింపదలచినట్లు ఒక నోటీసును మద్రాసులోని ఇండస్ట్రీస్ అండ్ కామర్సు డైరెక్టరుకు పంపవలెను. సదరు నోటీసులో తమ పేరు, అడ్రెసు, వృత్తి, తమ ఆక్షేపణలకు గల కారణములు చిన్న స్టేటుమెంటు తెలుపవలెను. అట్టి నోటీసు, మద్రాసులోని ఇండస్ట్రీస్ అండ్ కామర్సు డైరెక్టరుకు ఈ నోటీసు ప్రచురణ తేది మొదలు ముప్పది రోజులలోగా చేరవలెను. ఏవైనా ఆక్షేపణలున్నయెడల, దరిమిలా తెలియజేయబడు తేదీని ఇండస్ట్రీస్ అండ్ కామర్సు డైరెక్టరు గారిచే, మద్రాసు, తౌజండ్ లైట్సు, మౌకేన్ గార్డెన్సులోని వారి ఆఫీసు వద్ద విచారింపబడును.

డైరెక్టర్ ఆఫ్ ఇండస్ట్రీస్ అండ్ కామర్సు, మద్రాసు.



## ప్రకటన

4 హెచ్.పి. కొనక్కొ, 6 హెచ్. పి. ఈస్టు జపాన్, 8 & 10 హెచ్. పి. యన్మార్ అన్నీ జపాన్ ఇంజనులు ఓడమీదనుండి బహుత్వరలో చేరనున్న కళాస్టెక్ మెల్లనుండి లభించగలవు. వివరములకు: బాక్సు నం. 5/1671, C/o ఆంధ్ర పత్రిక, మద్రాసు-1.

